
గొల్లపూడి
శ్రీ వేంకటేశ్వర స్వామి వారి
ఏడు శనివారముల వ్రతము
శ్రీ వేంకటేశ్వర స్వామి కటాక్ష సిద్ధికి, శనైశ్చరదోష నివృత్తికి

7. రెండు కుందులలో ఉదయాన ఏడు వత్తులతో దీపాలు పెట్టాలి.
8. ఉదయం పూజలో ఏడు అరటిపళ్ళు, మీకు నచ్చిన ఏడు పండ్లు, నల్లద్రాక్షపళ్ళు, ఏడు నిమ్మ్మలిపుండలు నైవేద్యం పెట్టాలి.
9. ప్రతి రోజు ఉదయం పూజలో కొబ్బరికాయ కొట్టవలెను.
10. ఉదయంవేళ వేంకటేశ్వరునికి పూజ చెయ్యాలి. యథా శక్తిగా వేంకటేశ్వర సుప్రభాతం, దండకము, గోవింద నామాలు, స్తోత్రాలు చదవాలి.
11. తప్పనిసరిగా శని స్తోత్రం, ధ్యానశ్లోకం, షోడశ నామములు చదవాలి.
12. ఉదయం పూజలో నివేదించిన ప్రసాదాన్ని- మధ్యాహ్నం అల్పాహారంగా తీసికొనవచ్చు. మధ్యాహ్నం భోజనము చేయరాదు. అతిథి లేదా దంపతులు- వారితోపాటే మధ్యాహ్నం ప్రసాదాన్ని అల్పాహారంగా తీసుకోవాలి.

## ఏడు శనివారముల రాత్రి పూజలో నియమాలు

1. సాధారణ స్నానమైన తరువాత ఆరవేసిన బట్టలు కట్టుకోవాలి.
2. సాయంత్రం పూజ 6 గం॥ల నుండి 7 గం॥లోపుగా చేయాలి.
3. రాత్రి పూజలో అరటిపళ్ళు, ఇతరమైన ఫలాలతోపాటు ఏడు లడ్డూలు కూడా నివేదన చెయ్యాలి.
4. ఏడు అగరువత్తులు వెలిగించవలెను.
5. రెండు కుందులలో ఏడు వత్తులతో దీపాలు పెట్టాలి.
6. పూజ పూర్తిఅయిన తరువాత వండిన భోజన పదార్థాలన్నీ, పళ్ళెంలో తెచ్చి దేవుడికి మహా నైవేద్యం పెట్టాలి.
7. పూజ అయిన తరువాత ఒక అతిథికి లేదా దంపతులకు భోజనం పెట్టాలి.



8. అతిథికి అరటాకులో భోజనం పెట్టడం ప్రశస్తం.
9. వడ్డన అయిన తరువాత అతిథికి కూడా తీర్థ ప్రసాదాలు ఇవ్వాలి.
10. ఆ తరువాత, అతిథి చేతిలో నీళ్ళు పోసి త్రాగుమని, ఆపైన భోజనం ప్రారంభించమనాలి.
11. అతిథి భోజనం చేసిన తరువాత, అతనికి దక్షిణను తాంబూలంతో ఇవ్వాలి. ఆరోజు కలశలో పూజించిన కొబ్బరికాయను రవికలగుడ్డను మండపములోని బియ్యమును ఏడు శనివారాల వ్రత పుస్తకమును అతిథికి లేదా దంపతులకు యిచ్చి అలమేలు మంగా పద్మావతీ సమేత శ్రీనివాసునిగా భావించి నమస్కరించాలి.
12. ఆ తరువాతే వ్రతం చేసిన యజమానులు భుజించాలి.
13. రాత్రి భోజనము అయిన తరువాత వ్రతకథల (వేంకటేశ్వర మాహాత్మ్యం, కుమ్మరివాని కథ, దేవదత్త దంపతుల కథ) శ్రవణం చెయ్యాలి.
14. వ్రతకథ అంతా విన్న తరువాత దేవునికి 7 పండ్లను నివేదన చెయ్యాలి.

## శ్రీ సప్తగిరీశ్వర సప్త (7) శనివారవ్రతము పూజా విధానము

తదేవలగ్నం సుదినంతదేవ తారాబలం చంద్రబలం తదేవ, విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి
శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం, ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

దీపమును వెలిగించి దీపపుకుందిని కుంకుమ అక్షతలతో అలంకరింపవలెను.

ఓం ఉద్దీప్యస్వజాతవేదోపఘ్నం నిఋతింమమ, పశూగ్ంశ్చమహ్యామావహ జీవనందిశోదివ॥ దీపమునకు నమస్కరించి
ఆగమార్థం తుదేవానాం గమనార్థం తురక్షసాం కురుఘంటారవం తత్రదేవతాహ్వాన లాంఛనమ్॥ గంటను మ్రోగించవలెను.

ఆచమ్య. ఓం కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా, (అని మూడుసార్లు కుడిచేతిలో నీరు పోసుకొని త్రాగాలి.)

ఓం గోవిందాయ నమః విష్ణవే నమః, మధుసూదనాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్దనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

ఉత్తిష్ఠంతు భూత పిశాచాః యతే భూమిభారకాః, ఏతేషా మవిరోధేన పూజాకర్మ సమారభే. (అక్షతలు వెనుక వేసుకొని ముక్కు పట్టుకొని ప్రాణాయామం చెయ్యాలి.)

**"పూరకం కుంభకం చైవ రేచకం తదనంతరం । ప్రాణాయామ మిదంప్రోక్తం సర్వదేవ వశంకరమ్"**

సంకల్పము :- మమ ఉపాత్తదురి తక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, శుభేశోభనే ముహూర్తే శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భారతవర్షే, భరతఖండే, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన .......సంవత్సరే, ..... అయనే, ..... ఋతౌ, ....మాసే, .....పక్షే .....తిథౌ, ......వాసరే, శుభనక్షత్రే, శుభయోగే, శుకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్....గోత్రః, .....నామధేయః, (ధర్మపత్నీ సమేతః) శ్రీమతః ..... గోత్రస్య, .... నామధేయస్య, .... నామధేయస్య (ధర్మపత్నీ సమేతస్య) మమ ఉపాత్త దురిత క్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, అస్మాకం సకుటుంబ సభ్యానాం ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ....స్థిత శనైశ్చరదోష పరిహారార్థం, అలవేలుమంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినః ప్రసాద సిద్ధ్యర్థం సప్తశనివారవ్రత కల్పోక్త విధానేన యధాశక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే. (అక్షతలు - నీళ్ళు వదలాలి.) ఆదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం శ్రీ గణేశరూప విష్వక్సేన పూజాం కరిష్యే.



# విష్వక్సేన పూజా

(తమలపాకులో పసుపుతో గణపతిలాగే విష్వక్సేనుని చేసి మండపంలో పెట్టి)

**స్థాపం** :- పరివార సమేత శ్రీ విష్వక్సేనాయ నమః ప్రాణ ప్రతిష్ఠాపనం కృత్వా స్థాపయామి పూజయామి.

**ధ్యానమ్ :** "యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ।
శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే" ॥
శ్రీ విష్వక్సేనం ధ్యాయామి.

శ్రీ విష్వక్సేనాయ నమః -ఆవాహయామి
శ్రీ విష్వక్సేనాయ నమః -సింహాసనం సమర్పయామి
శ్రీ విష్వక్సేనాయ నమః -పాద్యం(నీరు)సమర్పయామి
శ్రీ విష్వక్సేనాయ నమః - అర్ఘ్యం (నీరు) సమర్పయామి
శ్రీ విష్వక్సేనాయ నమః -ఆచమనం (నీరు) సమర్పయామి
శ్రీ విష్వక్సేనాయ నమః - స్నానం సమర్పయామి
స్నానానంతరం ఆచమనం సమర్పయామి.
శ్రీ విష్వక్సేనాయ నమః - వస్త్రయుగ్మం సమర్పయామి
శ్రీ విష్వక్సేనాయ నమః - యజ్ఞోపవీతం సమర్పయామి
శ్రీ విష్వక్సేనాయ నమః - గంధం సమర్పయామి
శ్రీ విష్వక్సేనాయ నమః - పుష్పం సమర్పయామి

# షోడశనామపూజ

ఓం విష్వక్సేనాయ నమః, ఓం శ్రీమతే నమః, ఓం సూత్రవతీ నాధాయ నమః, ఓం గజాశ్వముఖసేవితాయ నమః ఓం ప్రసన్న వదనాయ నమః, ఓం శాంతాయ నమః. ఓం వేత్ర పాణయే నమః, ఓం ప్రభాకరసమప్రభాయ నమః ఓం హృషీకేశాయ నమః, ఓం విశ్వరక్షాపరాయణాయ నమః, ఓం అంతరాయ విధ్వంసినే నమః, ఓం ఆర్యాయ నమః ఓం అమాత్యాయ నమః, ఓం కృపానిధయే నమః, ఓం పారిషదప్రముఖాయ నమః, ఓం సర్వపాప హరాయ నమః

శ్రీ విష్వక్సేనాయ నమః, షోడశనామభిః పూజయామి.

శ్రీ విష్వక్సేనాయ నమః - ధూపమాఘ్రాపయామి
శ్రీ విష్వక్సేనాయ నమః - దీపం దర్శయామి
ధూపదీపానంతరంనాచమనం సమర్పయామి.
శ్రీ విష్వక్సేనాయ నమః - గుడఖండం నివేదయామి

శ్రీ విష్వక్సేనాయనమః-తాంబూలాది సర్వోపచారాన్ సమర్పయామి.
శ్రీ విష్వక్సేన ప్రసాదం శిరసా గృహ్ణామి
శ్రీ విష్వక్సేనం యధాస్థాన ముద్వాసయామి.

# శ్రీ వేంకటేశ్వర పూజా

ప్రాణానాయమ్య.... ప్రీత్యర్థం మమ.... స్థానస్థిత శనైశ్చర దోష పరిహారార్థం, శ్రీమదలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామిన ముద్దిశ్య యధాశక్తి షోడశోపచార పూజాం కరిష్యే (అని సంకల్పము చెప్పిన తరువాత) తదంగ కలశారాధనం కరిష్యే. (కలశమును ముట్టుకొని)

"కలశస్య ముఖే విష్ణుః కంఠేరుద్రస్సమాశ్రితః మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యేమాతృగణాఃస్మృతాః ।
కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదోహ్యధర్వణః
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః (కలశములో నీళ్ళుపోసి)
గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు
ఆయాంతు శ్రీ వేంకటేశ్వరస్వామినః పూజార్థం దురితక్షయకారకాః కలశోదకేన దేవం ఆత్మానం పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య

**ప్రాణప్రతిష్ఠ** : శ్రీ వేంకటేశ పూజార్థం స్థాపితం కలశం మయా
ప్రాణప్రతిష్ఠాం కుర్వేహం పూజాంతం తిష్ఠతు స్థిరమ్ ప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే

**ధ్యానమ్** : శాంతాకారం భుజంగ శయనం పద్మనాభం సురేశం విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం కమల నయనం యోగి హృద్ధ్యానగమ్యం వందేవిష్ణుం భవభయహరం సర్వలోకైక నాథమ్ ॥
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః ధ్యాయామి



**ఆవాహనం** : ఆవాహయామిదేవేశ! సిద్ధగంధర్వ సేవిత! పూజాం స్వీకురు మద్దత్తాం ప్రసీద కరుణానిధే!
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః ఆవాహయామి.

**రత్నసింహాసనం** : దేవ దేవ జగన్నాథ ప్రణతక్లేశనాశన! రత్నసింహాసనం దివ్యం గృహాణ మధుసూదన!
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః రత్నసింహాసనం సమర్పయామి.

**పాద్యం** : వాంఛితం కురుమేదేవ! దుష్కృతం చ వినాశయ, పాద్యం గృహాణ భగవన్ మాతురుత్సంగ సంస్థిత!
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః పాద్యం సమర్పయామి.

**అర్ఘ్యం** : కురుష్వమేదయాందేవ సంసారార్తి భయాపహా! కుసుమాక్షత సంయుక్తం గృహాణార్ఘ్యం నమోస్తుతే.
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

**ఆచమనం** : నమస్సత్యాయ శుద్ధాయ నిత్యాయ జ్ఞాన రూపిణే, గృహాణాచమనం దేవ! సర్వలోకైక నాయక!
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః ముఖే ఆచమనం సమర్పయామి

**పంచామృత స్నానం** : దధిక్షీరాజ్యమధుభిః శర్కరాఫలమిశ్రితం పంచామృత స్నానమిదం గృహాణ పురుషోత్తమ!
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే పంచామృత స్నానం సమర్పయామి.

**శుదోధదక స్నానం** : గంగా గోదావరీ కృష్ణా కావేర్యాది నదీ జలైః శుద్ధోదక స్నానమిదం పాదోద్భూత సురాపగ!
శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః శుద్ధోదక స్నానం సమర్పయామి. స్నానానంతరం శుద్ధాచమనం సమర్పయామి.

**వస్త్రం** : తప్తకాంచన సంకాశం పీతాంబరమిదం హరే! గృహాణ శ్రీజగన్నాథ! శ్రీనివాస నమోస్తుతే
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః వస్త్రయుగ్మం సమర్పయామి.

**ఉపవీతం** : బ్రహ్మావిష్ణు మహేశానైః నిర్మితం బ్రహ్మసూత్రకం, యజ్ఞోపవీతం గృహ్ణీష్వ సప్తశైల శిరోమణే!
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

**గంధం** : చందనాగరు కస్తూరీ ఘనసార సమన్వితం, గంధం గృహాణ గోవింద! పరమామోదపూరితమ్
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః దివ్యశ్రీచందనం సమర్పయామి.

**అక్షతలు** : గోవింద పరమానంద! హరిద్రాసహితాక్షతాన్ విశ్వేశ్వర! విశాలాక్ష! గృహాణ పరమేశ్వర!
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః అక్షతాన్ సమర్పయామి.

**పుష్పం** : సుగంధీని సుపుష్పాణి జాజీకుంద ముఖానిచ, మాలతీ వకులాదీని పూజార్థం ప్రతిగృహ్యతామ్ ॥
అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః పుష్పాంజలిం సమర్పయామి.

**అంగపూజా:**

శ్రీ వేంకటేశ్వరాయ నమః: - పాదౌ పూజయామి
శ్రీ వేంకటాచలధీశాయ నమః: - గుల్ఫౌ పూజయామి
శ్రీ ప్రదాయకాయ పమః: - జంఘే పూజయామి
పద్మావతీ పతయే నమః: - జానునీ పూజయామి
జ్ఞాన ప్రదాయ నమః: - ఊరూ పూజయామి
శ్రీనివాసాయ నమః: - కటిం పూజయామి
మహాభాగాయ నమః: - కటిం పూజయామి
నిర్మలాయ నమః: - ఉదరం పూజయామి
విశాల హృదయాయ నమః: - హృదయం పూజయామి
పరిశుద్ధాత్మనే నమః: - స్తనౌ పూజయామి
పురుషోత్తమాయ నమః: - భుజౌ పూజయామి
స్వర్ణహస్తాయ నమః: - హస్తౌ పూజయామి
వరప్రదాయ నమః: - కంఠం పూజయామి
లోకనాథాయనమః: - స్కంధౌపూజయామి
సర్వేశ్వరాయ నమః: - ముఖం పూజయామి
రసజ్ఞాయ నమః: - నాసికాం పూజయామి
పుణ్యశ్రవణ కీర్తినాయ నమః: - శ్రోత్రే పూజయామి
ఫుల్లాంబుజవిలోచనాయనమః: - నేత్రే పూజయామి
వర్చస్వినే నమః: - లలాటం పూజయామి
సహస్రశీర్షాయ నమః: - శిరః పూజయామి
రమ్యవిగ్రహాయ నమః: - సర్వాణ్యంగాని పూజయామి

అలవేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః సర్వాణ్యంగాని పూజయామి.



# శ్రీ వేంకటేశ్వస్వామివారి అష్టోత్తర శతనామావళిః

ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర "నమః" చేర్చి చదువుకొనవలెను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| వేంకటేశ్వరాయ | గోపాలాయ | చక్రధరాయ | వరప్రదాయ | జగద్వ్యాపినే | అశ్వారూఢాయ |
| శ్రీనివాసాయ | పురుషోత్తమాయ | త్రిధామ్నే | అనేకాత్మనే | జగత్కర్త్రే | ఖడ్గధారిణే |
| లక్ష్మీపతయే | గోపీశ్వరాయ | త్రిగుణాశ్రయాయ | దీనబంధవే | జగత్సాక్షిణే | ధనార్జనసముత్సుకాయ |
| అనామయాయ | పరంజ్యోతిషే | నిర్వికల్పాయ | ఆర్తలోకాభయప్రదాయ | జగత్పతయే | ఘనసారలసన్మధ్య- |
| అమృతాంశవే | వైకుంఠపతయే | నిష్కళంకాయ | ఆకాశరాజవరదాయ | చింతితార్థప్రదాయకాయ | -కస్తూరీతిలకోజ్జ్వలాయ |
| జగద్వంద్యాయ | అవ్యయాయ | నిరాతంకాయ | యోగిహృత్పద్మ- | జిష్ణవే | సచ్చిదానందరూపాయ |
| గోవిందాయ | సుధాతనవే | నిరంజనాయ | మందిరాయ | దాశార్హాయ | జగన్మంగళదాయకాయ |
| శాశ్వతాయ | యాదవేంద్రాయ | నిరాభాసాయ | దామోదరాయ | దశరూపవతే | యజ్ఞరూపాయ |
| ప్రభవే | నిత్యయౌవనరూపవతే | నిత్యతృప్తాయ | జగత్పాలాయ | దేవకీనందనాయ | యజ్ఞభోక్త్రే |
| శేషాద్రినిలయాయ | చతుర్వేదాత్మకాయ | నిరుపద్రవాయ | పాపఘ్నాయ | శౌరయే | చిన్మయాయ |
| దేవాయ | విష్ణవే | నిర్గుణాయ | భక్తవత్సలాయ | హయగ్రీవాయ | పరమేశ్వరాయ |
| కేశవాయ | అచ్యుతాయ | గదాధరాయ | త్రివిక్రమాయ | జనార్దనాయ | పరమార్థప్రదాయ |
| మధుసూదనాయ | పద్మినీ ప్రియాయ | శార్ఙ్గపాణయే | శింశుమారాయ | కన్యాశ్రవణతారేడ్యాయ | శాంతాయ/ శ్రీమతే |
| అమృతాయ | ధరాపతయే | నందకినే | జటామకుటశోభితాయ | పీతాంబరధరాయ | దోర్దండవిక్రమాయ |
| కృష్ణాయ | సురపతయే | శంఖధారకాయ | శంఖమధ్యోల్లసన్మంజు- | అనఘాయ | పరాత్పరాయ |
| జ్ఞానపంజరాయ | నిర్మలాయ | అనేకమూర్తయే | కింకిణ్యాఢ్యకరండకాయ | వనమాలినే | పరబ్రహ్మణే |
| శ్రీవత్సవక్షసే | దేవపూజితాయ | అవ్యక్తాయ | నీలమేఘశ్యామతనవే | పద్మనాభాయ | శ్రీవిభవే |
| సర్వేశాయ | చతుర్భుజాయ | కటిహస్తాయ | బిల్వపత్రార్చనప్రియాయ | మృగయాసక్తమానసాయ | జగదీశ్వరాయ |

# శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామావళిః

**ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర "నమః" చేర్చి చదువుకొనవలెను.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రకృత్యై | లక్ష్మ్యై | లోకశోకవినాశిన్యై | ప్రభాయై | శాంతాయై | హిరణ్యప్రాకారాయై |
| వికృత్యై | నిత్యపుష్టాయై | ధర్మనిలయాయై | చంద్రవదనాయై | శుక్ల మాల్యాంబరాయై | సముద్రతనయాయై |
| విద్యాయై | విభావర్యై | కరుణాయై | చంద్రాయై | శ్రియై | జయాయై |
| సర్వభూత హిత- | అదిత్యై | లోకమాత్రే | చంద్రసహోదర్యై | భాస్కర్యై | మంగళాదేవ్యై |
| -ప్రదాయై | దీప్తాయై | పద్మప్రియాయై | చతుర్భుజాయై | బిల్వనిలయాయై | మంగళాయై |
| శ్రద్ధాయై | వసుధాయై | పద్మహస్తాయై | చంద్రరూపాయై | వరారోహాయై | దేవ్యై |
| విభూత్యై | వసుధారిణ్యై | పద్మాక్ష్యై | ఇందిరాయై | యశస్విన్యై | విష్ణువక్షస్థలస్థితాయై |
| సురభ్యై | కమలాయై | పద్మసుందర్యై | ఇందుశీతలాయై | వసుంధరాయై | విష్ణుపత్న్యై నమః |
| పరమాత్మికాయై | కాంతాయై | పద్మోద్భవాయై | ఆహ్లాదజనన్యై | ఉదారాంగాయై | ప్రసన్నాక్ష్యై |
| వాచే నమః | కామాక్ష్యై | పద్మముఖ్యై | పుష్ట్యై | హరిణ్యై | నారాయణ సమాశ్రితాయై |
| పద్మాలయాయై | క్రోధసంభవాయై | పద్మనాభప్రియాయై | శివాయై | హేమమాలిన్యై | దారిద్ర్యధ్వంసిన్యై |
| పద్మాయై | అనుగ్రహపదాయై | పద్మమాలాధరాయై | శివకర్యై | ధనధాన్యకర్యై | దేవ్యై |
| శుచయే | బుద్ధయే | రమాయై/దేవ్యై | సత్యై | సిద్ధయే నమః | సర్వోపద్రవవారిణ్యై |
| స్వాహాయై | అనఘాయై | పద్మిన్యై | విమలాయై | స్త్రైణసౌమ్యాయై | నవదుర్గాయై |
| స్వధాయై | హరివల్లభాయై | పద్మగంధిన్యై | విశ్వజనన్యై | శుభప్రదాయై | మహాకాళ్యై |
| సుధాయై | అశోకాయై | పుణ్యగంధాయై | పుష్టయే | నృపవేశ్మగతానందాయై | బ్రహ్మవిష్ణు శివాత్మికాయై |
| ధన్యాయై | అమృతాయై | సుప్రసన్నాయై | దారిద్ర్యనాశిన్యై | వరలక్ష్మ్యై | త్రికాలజ్ఞాన సంపన్నాయై |
| హిరణ్మయై | దీప్తాయై | ప్రసాదాభిముఖ్యై | ప్రీతిపుష్కరిణ్యై | వసుప్రదాయై | భువనేశ్వర్యై |



# శ్రీ పద్మావతీ అష్టోత్తర శతనామావళిః

**ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర "నమః" చేర్చి చదువుకొనవలెను.**

| | | | | |
|---|---|---|---|---|
| పద్మావత్యై | విష్ణుప్రియాయై | ప్రాజ్ఞాయై | సర్వలోక నివాసిన్యై | ఆకాశరాజపుత్రికాయై |
| దేవ్యై | నిత్యకల్యాణ్యై | మహాధర్మాయై | భూజాయై | సువర్ణహస్తధారిణ్యై |
| పద్మోద్భవాయై | కోటిసూర్యప్రకాశిన్యై | ధర్మరూపిణ్యై | ఐశ్వర్యప్రదాయిన్యై | కామరూపిణ్యై |
| కరుణప్రదాయిన్యై | మహాసౌందర్యరూపిణ్యై | అలంకారప్రియాయై | శాంతాయై | కరుణాకటాక్షధారిణ్యై |
| సహృదయాయై | భక్తవత్సలాయై | సర్వదారిద్ర్యధ్వంసిన్యై | ఉన్నతస్థానస్థితాయై | అమృతానుజాయై |
| తేజస్వరూపిణ్యై | బ్రహ్మాండవాసిన్యై | శ్రీవేంకటేశవక్షస్థలస్థితాయై | మందారకామిన్యై | భూలోకస్వర్గసుఖదాయిన్యై |
| కమలముఖ్యై | సర్వవాంఛాఫలదాయిన్యై | లోకశోకవినాశిన్యై | కమలాకరాయై | అష్టదిక్పాలకాధిపత్యై |
| పద్మధరాయ | ధర్మసంకల్పాయై | వైష్ణవ్యై | వేదాంతజ్ఞానరూపిణ్యై | మన్మథదర్పసంహారిణ్యై |
| శ్రియై | దాక్షిణ్యకటాక్షిణ్యై | తిరుచానూరుపురవాసిన్యై | సర్వసంపత్తిరూపిణ్యై | కమలార్థభాగాయై |
| పద్మనేత్రాయై | భక్తిప్రదాయిన్యై | వేదవేద్య విశారదాయై | కోటిసూర్యసమప్రభాయై | స్వల్పాపరాధ మహాపరాధక్షమాయై |
| పద్మకరాయై | గుణత్రయ వివర్జితాయై | విష్ణుపాద సేవితాయై | పూజాఫలదాయిన్యై | షట్కోటితీర్థవాసితాయై |
| సుగుణాయై | సర్వలోకానాంజనన్యై | రత్నప్రకాశకిరీటధారిణ్యై | కమలాసనాది సర్వ- | నారదాదిమునిశ్రేష్ఠ పూజితాయై |
| కుంకుమప్రియాయై | గుణత్రయ వివర్జితాయై | జగన్మోహిన్యై | -దేవస్తుతాయై | ఆదిశంకరపూజితాయై |
| హేమవర్ణాయై | కళాషోడశసంయుతాయై | శక్తిస్వరూపిణ్యై | వైకుంఠవాసిన్యై | మహాకీర్తి ప్రదాయిన్యై |
| చంద్రవందితాయై | సర్వలోకానాంజనన్యై | ప్రసన్నోదయాయై | ద్రాక్షాఫలపాయస ప్రియాయై | కృష్ణాతిప్రియాయై |
| ధగద్ధగప్రకాశ- | ముక్తిదాయిన్యై | ఇంద్రాదిదైవ యక్షకిన్నర | నృత్య గీతప్రియాయై | గంధర్వశాపవిమోచకాయై |
| -శరీరధారిణ్యై | దయామృతాయై | - కింపురుషపూజితాయై | క్షీరసాగరోద్భవాయై | కృష్ణపత్న్యై |

| | | | | |
|---|---|---|---|---|
| [illegible] | [illegible] | శ్రీ శ్రీనివాస ప్రియాయై | కోటి మన్మథరూపిణ్యై | సర్వమంగళరూపిణ్యై |
| [illegible] | [illegible] | చంద్రమండలస్థితాయై | భానుమండలరూపిణ్యై | సర్వానుగ్రహ ప్రదాయిన్యై |
| [illegible] | [illegible] | అలివేలుమంగాయై | సర్వమానసవాసిన్యై | ఓంకారస్వరూపిణ్యై |
| [illegible] | [illegible] | దివ్యమంగళ ధారిణ్యై | సర్వాయై | బ్రహ్మజ్ఞానసంభూతాయై |
| [illegible] | [illegible] | సుకళ్యాణపీఠస్థితాయై | విశ్వరూపాయై | శ్రీపద్మావత్యై |
| [illegible] | [illegible] | కామ్యకవనపుష్ప- | దివ్యజ్ఞానాయై | శ్రీమహాలక్ష్మ్యై |
| [illegible] | [illegible] | - ప్రియాయై | | |

**ధూపం** : వనస్పతి రసోద్భూతం గంధాఢ్యో గంధ ఉత్తమః ఘృతేన సమన్వితం ధూపం గృహాణ దేవేశ! సర్వలోక నమస్కృత!
అలమేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః ధూపమాఘ్రాపయామి.

**దీపం** : త్రిలోకేశ! మహాదేవేశ! సర్వజ్ఞాన ప్రదాయక! దీపందాస్యామి దేవేశ! రక్షమాం భక్తవత్సల!
శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః దీపం దర్శయామి. ధూపదీపానంతరం ఆచమనం సమర్పయామి

**నైవేద్యం** : సర్వభక్ష్యైశ్చ భోజ్యైశ్చ రసైష్షడ్భిస్సమన్వితం నైవేద్యంత తు మయా నీతం గృహాణ పురుషోత్తమ!
(ప్రోక్షణ చేసిచుట్టు నీళ్ళు చల్లాలి)
"యోదేవస్సవితా స్మాకం ధియోధర్మాది గోచరాః ప్రేరయేత్తస్యయద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే ॥
శ్రీ అలమేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః (పదార్థాల పేర్లు చెప్పి).... నైవేద్యం సమర్పయామి.
ఓం ప్రాణాయ నమః, అపానాయ నమః, వ్యానాయ నమః, ఉదానాయనమః, సమానాయ నమః,
మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనం సమర్పయామి.
(నాలుగుసార్లు పువ్వుతో నీళ్ళు వదలాలి.)



**తాంబూలం** : పూగీఫలైస్సకర్పూరైః నాగవల్లీదళైర్యుతం జగన్నాథ! శ్రీనివాస! తాంబూలం ప్రతిగృహ్యతామ్
అలమేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః తాంబూలం సమర్పయామి.

**నీరాజనం** : శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినాం శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్
అలమేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః అక్షతాన్ సమర్పయామి.
సంతతశ్రీరస్తు, సమస్త మంగళాని భవంతు నిత్యశ్రీరస్తు, నిత్యమంగళాని భవంతు
శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః కర్పూర నీరాజనం దర్శయామి. నీరాజనానంతరం శుద్ధాచమ సమర్పయామి.

**మంత్రపుష్పం** : గదా ఘన శంఖ రథాంగ కల్పక ధ్వజారవిందాంకుశ వజ్రలాంఛిత!
సమానివాసైక మనోజ్ఞ మానస! శ్రియం ప్రయచ్ఛ ప్రణతార్తి భంజన!
తత్పురుషాయ విద్మహే శ్రీనివాసాయ ధీమహి తన్నః శ్రీనివాసః ప్రచోదయాత్
మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్న్యై చ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్
అలమేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః సువర్ణమంత్రపుష్పం సమర్పయామి.

**ప్రదక్షిణ నమస్కారాః** : యానికాని పాపాని జన్మాంతర కృతానిచ తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే
అన్యథాశరణం నాస్తి త్వమేవశరణం మమ తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష జనార్దన!
అలమేలు మంగా పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి
ఛత్రం ధారయామి, చామరైః వీజయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, ఆందోళికానారోపయామి,
సమస్త మహారాజోపచారాన్ సమర్పయామి.
అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వాత్మకః. శ్రీ అలమేలు మంగా పద్మావతి
సమేత శ్రీ వేంకటేశ్వరస్వామి సుప్రీతః సుప్రసన్నో వరదో భవతు.
శ్రీ వేంకటేశ్వరస్వామినః ప్రసాదం శిరసాగృహ్ణామి.

# శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యము

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

ధ్యాయేత్ శ్రీ వేంకటేశం కలిమలహరణం కాంచనారాధితాంఘ్రిం శేషాద్రౌ నిత్యవాసం సహచరి రమయా భూమి వైకుంఠనాథం, సుబ్రహ్మణ్యం సురేశం సకల మునిగణధ్యేయ సన్మంత్ర మూర్తిం సర్వేష్టార్థ ప్రదాన ప్రథితయశసం విష్ణు మర్చావతారమ్ ।

శౌనకాది మునులతో మహా సూతుడిలా చెప్పసాగినాడు. అది సత్యలోకం. బ్రహ్మదేవుడు సరస్వతికి సృష్టి విశేషాలను వివరిస్తున్నాడు. అక్కడికి ఆయన మానసపుత్రుడు నారదుడు వచ్చి వారికి నమస్కరించాడు. బ్రహ్మ దీవించినాడు. నారదుడు, తండ్రీ! వచ్చేది కలియుగంగదా! దేవతలు భూలోకంలో అడుగు పెట్టడానికే భయపడతారు. మరి ప్రజలు శ్రీమన్నారాయణుని పూజించుకొనే అవకాశం ఏది?" అని ప్రశ్నించాడు. బ్రహ్మదేవుడు "నాయనా! నీ ప్రశ్నలోక శ్రేయస్సును కోరేదిగా ఉంది. సంతోషం. ఆ భగవానుడు కరుణామయుడు. తన బిడ్డలైన ప్రజల్ని విడిచిపెట్టడు. ఏదో ఒక కారణం కల్పించుకొని భూలోకంలో అవతరిస్తాడు. చూస్తూండు". అని చెప్పగా, బ్రహ్మవాక్యం తప్పక జరుగుతుందని నారదుడు సంతుష్టుడైనాడు.

కలియుగం మొదలైనది. కలిదోష నివారణం కోసం మహర్షులందరూ నైమిశారణ్యంలో ఒక సత్రయాగం చెయ్యాలని సంకల్పించారు. అయితే ఆ యజ్ఞఫలాన్ని ఎవ్వరికి ధారపోస్తే ప్రయోజనం కలుగుతుందని చర్చించారు. వారిలో భృగు మహర్షి లేచి "యజ్ఞఫలానికి త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు శంకరులలో ఎవరు తగినవారో నేను పరీక్షించి తెలుసుకొని వస్తానన్నాడు. ఆయన మహాతపశ్శాలి. తన తపః ప్రభావముతో కుడి కాలిలో ఒక కన్నును కూడా పొంద గలిగాడు. మునులంతా భృగుమహర్షిని పంపడానికి ఆమోదించారు.

ఆయన ముందుగా వెళ్ళి బ్రహ్మగారి ముందు వున్న ఆసనం మీద కూర్చున్నాడు. తనకు నమస్కరించలేదని



బ్రహ్మకు భృగువుమీద కోపం వచ్చి మర్యాదలు చెయ్యలేదు. దానిత భృగుమహర్షికి కోపం వచ్చి "మహా తపశ్శాలినై బ్రహ్మర్షినై, నీ అంతవాడనైన నన్ను అతిథిగా మన్నించలేకపోయావు. సృష్టికర్తనని అహంకరిస్తూన్న నీకు భూలోకంలోఎక్కడా పూజా పురస్కారాలు లేకుండా పోవును గాక" అని శపించాడు.

తరువాత కైలాసానికి వెళ్ళాడు. అక్కడ పరమేశ్వరుడు పార్వతితో ఆనందనాట్యం చేస్తూ భృగువు రాకను గమనించలేదు. దానితో భృగుమహర్షి కోపావిష్టుడై "మహేశ్వరా! నీవు నాట్య విలాసాలలో మునిగి మహాతపశ్శాలిని, అతిథిని అయిన నన్ను నిర్లక్ష్యం చేశావు కనుక, భూలోకంలో నీకు లింగరూపంలోనే కాని నిజరూపంలో ఆరాధన జరగకుండును గాక! అని శపించినాడు.

ఆ తరువాత విష్ణులోకానికి వచ్చాడు. మాధవుడు పానుపుమీద పరుండి, తనకు పాదసేవ చేస్తూన్న లక్ష్మీదేవితో సరససల్లాపాలు ఆడుతున్నాడు. మునిరాకను గమనించలేదు. భృగువు వెళ్ళి, "అతిథిగా వచ్చిన నన్ను అవమానిస్తావా? అంటూ విష్ణుమూర్తి గుండెలమీద తన్నినాడు. ఒక్కసారిగా లోకాలన్నీ కంపించాయి. సముద్రాలు కలగిపోయాయి. భూమి దద్దరిల్లింది. అయినా శ్రీమహావిష్ణువు రవ్వంత కూడా ఆగ్రహించక పరమశాంత స్వభావముతో లేచి మునికి నమస్కరించి "మునీంద్రా! మీ రాకచేత వైకుంఠమే పావనమైనది. మీరాకను గమనించలేని నా అవినయాన్ని మన్నించండి". అంటూ భృగుమహర్షికి పాదాలొత్తుతూ కాలిలో వున్న జ్ఞాననేత్రాన్ని చిదిపివేశాడు. భృగుమహర్షికి గర్వభంగమైనది. విష్ణుమూర్తికి నమస్కరించి "ఓ దేవదేవా! మీవంటి సత్యగుణ సంపన్నులు పదునాలుగు లోకాలలోను లేరు. నా అహంకారాన్ని మన్నించండి. మీరేలోక సంరక్షణకు తగినవారు. కాబట్టి భూలోకంలో కలిప్రభావాన్ని నశింపజేసి, ధర్మసంరక్షణచేసి, ప్రజల కష్టాలను తీర్చడానికి తప్పకుండా అవతరించాలి." అని ప్రార్థించి తిరిగి భూలోకానికి వచ్చి మునులతో "త్రిమూర్తులలోను పరమసాత్త్వికుడు శ్రీమన్నారాయణుడే. అతడే యజ్ఞఫలానికి అర్హుడు. అని నిష్కర్షగా చెప్పినాడు. మునులందరూ సత్రయాగం చేసి ఆ ఫలాన్ని యజ్ఞపురుషుడైన గోవిందునికే ధారపోసినారు.

అక్కడ వైకుంఠంలో లక్ష్మీదేవికి కోపం వచ్చింది. శ్రీహరి వక్షస్థలమే తన నివాసం. ఆ వక్షస్థలాన్ని ఒక ముని

కాలితో తన్నినాడు. అందుకు శ్రీహరి కోపించక ఆయనకు చాలా మర్యాదలు చేసినాడు. భర్తయే తనను గౌరవించలేదు. అందుకే లక్ష్మికి కోపం వచ్చి భూలోకానికి ప్రయాణమైనది. లక్ష్మి లేని యిల్లు కళావిహీనమైనది. ఆమెను వెతికి తెచ్చుకోవడానికి భూలోకానికి ప్రయాణమైనాడు కేశవుడు. ఇంతలో భూదేవి వచ్చి "దేవా! కలియుగంలో అధర్మం పెరిగింది. పాపభారం మోయలేకపోతున్నాను. నువ్వు భూలోకంలో అవతరించి నన్ను కాపాడు." అని కోరింది. వెంటనే శ్రీ మహావిష్ణువు శ్రీనివాసుడనే పేరుతో భూలోకానికి అవతరించి (దిగివచ్చి) లక్ష్మికోసం వెతకడం ప్రారంభించాడు. శేషాద్రి కొండలలో ఒక పుట్టను నివాసంగా చేసుకున్నాడు.

శేషాద్రి పర్వతప్రాంతాలను పరిపాలిస్తున్న చోళమహారాజు ఆకాశరాజు. అతడు సంతానం లేక పుత్రకామేష్టి చెయ్యబోతూ భూమిని దున్నుతూండగా నాగలికి ఒక బంగారు పెట్టె తగిలింది. తెరచి చూడగా మహాలక్ష్మి కళతో ఒక బాలిక కనిపించింది. ఆమెయే భూలోకానికి వచ్చిన శ్రీమహాలక్ష్మి. ఆకాశరాజు సంతోషపడి ఆ పిల్లకు పద్మావతి అని పేరుపెట్టుకొని అల్లారుముద్దుగా పెంచాడు. యుక్తవయస్సు వచ్చిన పద్మావతి ఒకసారి, లక్ష్మిని వెతుకుతున్న శ్రీనివాసుని చూచి మోహించింది. తలిదండ్రులకు చెప్పింది. ఆకాశరాజు వచ్చి చూచి శ్రీనివాసుని తేజోవిశేషాలకు ఆశ్చర్యపడి అతడే శ్రీ మహావిష్ణువని భావించి పద్మావతినిచ్చి వివాహం చేశాడు.

ఆకాశరాజు తరువాత తొండమానుడు రాజైనాడు. శ్రీనివాసుడు వేంకటేశ్వరుడను నామంతో శేషాద్రి శిఖరాలమీద కలియుగాంతం వరకు నివసించాలని నిశ్చయించుకుని సాలగ్రామ శిలారూపుడై పద్మావతీ భూదేవులతో నివసించసాగినాడు. తొండమానుడు శ్రీ వేంకటేశ్వరునికి ఆలయం నిర్మించాడు. అప్పటి నుంచి తనను సేవించే భక్తులకు కల్పవృక్షంలాంటివాడై శ్రీనివాసుడు భక్తులను సంరక్షిస్తూ ఉన్నాడు. బ్రహ్మదేవుని వాక్యం యిలా ఫలించింది.

ఒకసారి నవగ్రహాలలో ఏడవవాడైన శనిదేవుడికి, తన నెవ్వరూ భక్తితో సేవించడం లేదనీ, భయంతో మాత్రమే పూజిస్తున్నారనీ విచారం కలిగింది. కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామిని గురించి తపస్సు చేశాడు. ఆ దేవుడు ప్రత్యక్షం కాగా, శనిదేవుడు "స్వామీ! నా పేరువింటే ప్రజలు భయపడుతున్నారు. అందరినీ పూజించినట్లు నన్ను



పూజించడం లేదు. ఇంక నుంచి నాకు ప్రీతి అయిన శనివారంనాడు నన్ను ధ్యానించి ఆరాధించి ఆపైన నిన్ను పూజించినవారికి సర్వదేవతలను పూజించిన ఫలం ఆ ఒక్కరోజులోనే రావా"లని కోరినాడు. అందుకు స్వామి చిరునవ్వు నవ్వి, "శనైశ్చరా! నీకోరిక సమంజసంగానే వుంది. అసలు నీకూ నాకూ భేదం ఏముంది? ఆరువారాలు దాటాక ఏడవవారం అంటే ఇష్టపడతావు. నేను ఆరుకొండలు దాటాక ఏడవ కొండమీద వుంటాను. నువ్వు నీల (నల్లని) వర్ణుడివి, నేను నీలవర్ణుడనే. నువ్వు శనిదేవుడవు, నేనూ శనిదేవుడనే. (శం=సుఖము, నీయతే=(ఇతనివలన) భక్తులకు అందించబడుతుంది. నువ్వు తలచుకుంటే నీ భక్తులను మహారాజ్యాధిపతులను చేస్తావు. నేనూ అంతే కదా! నువ్వు సప్తమగ్రహానివి, నేను సప్తగిరీశుడను. సామాన్యమానవులకు ఈ విశేష విషయాలు తెలియక నువ్వంటే భయపడుతున్నారు. నినూ నన్నూ వేరుగా చూస్తున్నారు. నువ్వు కోరిన వరాన్ని అనుగ్రహిస్తున్నాను. భక్తులు ఒక శనివారం నాడు ప్రారంభించి, ఏడు శనివారాల పాటు నిన్ను ముందు పూజించి, ఆ తరువాత నన్ను పూజిస్తూ ఒక మహావ్రతంగా ఆచరిస్తారో వారికి నువ్విచ్చేఫలంతో పాటు నా సంపూర్ణానుగ్రహం కూడా లభిస్తుంది. సమస్త శనిదోషాలనుంచీ వారు విముక్తులై సౌఖ్యాన్ని పొందుతారు. ఆయురారోగ్యైశ్వర్యాది సకల శ్రేయస్సులనూ పొందుతారు. ఇందులో సంశయమేమీ లేదు." అని వరమిచ్చాడు.

శౌనకాది మహామునులంతా సూతుడు చెప్పింది విని చాలా ఆనందించి, "ఈ సప్త శనివారవ్రతం ఆచరించి శ్రీనివాసుని అనుగ్రహం పొందిన వారెవ్వరైనా ఉంటే, వారి కథను వినిపించు"మని అతనిని అడిగారు. సూతుడు చెప్పడం ఆరంభించాడు.

## కుమ్మరివాని భక్తి

ఆదిత్య పురాణమున - భగవంతుడు కృతయుగమున నరసింహస్వామిగను, త్రేతాయుగమున శ్రీరామునిగను, ద్వాపరయుగమున శ్రీకృష్ణునిగను, కలియుగమున శ్రీ వేంకటేశ్వరస్వామిగను వెలసెను అని చెప్పబడినది.

స్కాందపురాణమున - కార్తికేయుడు కృతయుగమున స్కందునిగను, త్రేతాయుగమున కుమారస్వామిగను ద్వాపరమున సుబ్రహ్మణ్యునిగను కలియుగమున శ్రీ వేంకటేశ్వరస్వామిగను జన్మించెనని పలుకుచున్నది.

మార్కండేయ పురాణమున - భగవంతుడు శ్రీహరి షణ్ముఖునిగ అవతరించి కలియుగమున ఏకముఖుడగు కుమారస్వామిగను వేంకటాచలపతిగను దర్శనమిచ్చుచున్నాడు. అని చెప్పబడినది.

కుమ్మరివాని భక్తి శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహము తిరుపతి మహాక్షేత్రమునకు సమీపమున నొక పల్లెలో 'భీముడు' అను కుమ్మరి వాడొకడు కలడు. అతడు పేదవాడు. కుండలను తయారుచేసి వానిని అమ్ముకొని జీవించెడివాడు. వానికి శ్రీ వేంకటేశ్వరస్వామిపై భక్తి యెక్కువ. చిరకాలము దేవుని పూజింపవలయును అని యున్నను - కుటుంబ పరిస్థితిని బట్టి - వానికి అట్టి అవకాశముండెడిదికాదు. అందువలన తాను సారెపై కుండలను తయారు చేయు ప్రదేశమున శ్రీ వేంకటేశ్వరస్వామివారి ప్రతిమనుంచుకొనెను. సారెపై కుండలను తయారుచేయునప్పుడు తన చేతికి అంటిన మట్టిని పుష్పముగ చేసి భక్తితో స్వామివారి ప్రతిమ వద్ద నుంచు చుండెడివాడు. అచట నతడు పని చేసినంత కాలము వాని చేతికి అంటిన మట్టిని పుష్పములుగా చేసి స్వామివారి ప్రతిమ యొద్దనుంచుట వానికి నిత్య కృత్యమయ్యెను.

ఆ ప్రాంతమును పరిపాలించు రాజా తొండమానుడు కూడ శ్రీ వేంకటేశ్వరస్వామియందు భక్తి కలవాడు. అతడు ప్రతిదినమును వేంకటాచలమునకు పోయి స్వామివారిని బంగారు పూలతో అర్చించెడివాడు. అతడు పూజించి యుంచిన బంగారు పూలస్థానమున మట్టిపూలు స్వామివారి వద్ద నుండెడివి. తొండమానుడీవిషయమును గమనించెను. తానుంచిన బంగారుపూల స్థానమున మట్టిపూలు వుండుట వానికి అర్థము కాలేదు. అర్చకులు తానుంచిన బంగారు పూలను అపహరించి మట్టి పూలనుంచుచున్నారని యనుమానించెను. తన భటులను కాపలాగా నుంచెను. రాజా యెన్ని విధములగ యత్నించినను బంగారుపూల స్థానమున మట్టిపూవులే స్వామివారి యొద్ద నుండెడివి. మహారాజానకు



మానసిక వ్యథ పెరిగెను. చింతాపీడితుడైన వానికి శ్రీ వేంకటేశ్వరస్వామి కలలో కనిపించెను. రాజా! సమీపగ్రామమున భీముడను కుమ్మరియొకడు కలడు. అతడు కుండలు చేయుచు చేతికి అంటిన మట్టిని పుష్పములుగ చేసి నా ప్రతిమ వద్ద నుంచుచున్నాడు. అతడు కుమ్మరి అయినను కుండలు చేయుచున్నను నన్ను నిత్యము ధ్యానించు మూఢభక్తుడు. నా స్మరణమును ధ్యానమును విడువని అతడు మహాభక్తుడు. వాని భక్తి ప్రభావమున అతడుంచిన మట్టి పూవులు యిచటి నా సన్నిధానమును చేరుచున్నవి. నీవుంచినట్టి బంగారు పూలు అతడుంచిన పూలముందు నిలువలేక అదృశ్యములగుచున్నవి. భక్తిలో అతడు నీకంటె ఉత్తముడు. విచారింపకుము. అని ఆ రాజాను ఊరడించెను.

తనను మించిన భక్తుడొకడున్నాడని స్వామివారు చెప్పినమాటలు మనసులోనిలిచినవి. తనకలను స్వామివారి మాటలు నిజాన్ని పరిశీలించుటకై వేంకటాచలమునకు సమీపముననున్న పల్లెలలో భటులతో గలసి తిరుగసాగెను. ఒక పల్లెలో సారెపై కుండనుంచి త్రిప్పుచు చేతికి అంటిన మట్టిని పుష్పముగ చేసి సమీపమున నున్న శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ప్రతిమవద్ద పడునట్లు నేర్పుగ విసరుచు కుండలను చేయు భీముని చూచెను. రాజా వానిని జూచి ఆశ్చర్యపడెను.

రాజా భీముని సమీపించి ఓయీ! నీవు స్వామిని మట్టి పూలతో పూజించుట యేల? నీకు పూజకు పుష్పములు దొరకుటలేదా? నీవు సారెను త్రిప్పుచు - వచ్చిన మట్టిని పుష్పముగ చేసి స్వామివారిద్ద పడునట్లు విసరుటయు విచిత్రముగ నున్నది. నీ ఉద్దేశ్యమును వివరింపుమని యడిగెను. భీముడు రాజానకు నమస్కరించి మీవంటివారు వచ్చుటచే నా యిల్లు పావనమైనది. నేను చదువురాని మూర్ఖుడను స్వామివారిని పూజించుట యెట్లో తెలియనివాడు.ను. పూజావిధానము నెరుగనివాడను. నేను దరిద్రుడను. కుండలను చేయనిదే నా కుటుంబమునకు గడువదు. కావున నేనుదయమునుండి సాయంకాలము వరకు కుండలను చేయక తప్పదు. పూజా విధానము తెలియనివాడను. కుటుంబ పోషణకై కుండలను చేయక తప్పదు. ఇట్టి నేను తీరిక లేక యిట్లు చేయుచున్నాను. క్షమింపుడు. నేను శ్రీ వేంకటేశ్వర స్వామివారినే నమ్మిన వాడను. చేతికి అంటిన మట్టినే పుష్పముగ చేసి యిట్లు స్వామివారిని తలచుకొనుచు

సారెవద్దనుండి లేవరాని స్థితిలో నుండుటచే యిట్లు మట్టిపూలను స్వామివారకడ పడునట్లు విసరుచున్నాను అని భయభక్తులతో వినయముగా మహారాజునకు తన పరిస్థితిని వివరించెను.

కుమ్మరివాని మాటలను విన్న రాజు మిక్కిలి ఆశ్చర్యపడెను. కుమ్మరివాని భక్తికి మెచ్చి వానికి ధనమునిచ్చి తన రాజ్యమునకు పోయెను. ఆ తరువాత కొంతకాలమునకు భీముడు మరణించి స్వర్గమును చేరెను. శ్రీ వేంకటేశ్వరస్వామి "భీముని భక్తికి మెచ్చిన నీకు యికనుండి ప్రసాదములను మట్టిపాత్రలతోనే నివేదింపవలయునని తొండమాను మహారాజునకు కలలో కనిపించి చెప్పెను. ఈనాటికిని స్వామివారి సన్నిధిలోయీ ఆచారమును పాటించుచు మట్టికుండలతోనే ప్రసాదమును స్వామివారికి నివేదన చేయుచు - ఆరాధించుచున్నారు.

తొండమానుడు శ్రద్ధాభక్తులతో శ్రీ వేంకటేశ్వరస్వామిని అర్చించుచు నిత్యోత్సవములు, రథోత్సవములు సమారాధనలు మున్నగువానిని జరిపించుచు చివరకు మరణించి విష్ణులోకమును చేరెను.

## శనివార వ్రత కథ (దేవదత్త దంపతుల కథ)

పూర్వకాలం కాంచీపురంలో దేవదత్తుడనే ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతడు వేదవేదాంగ పారంగతుడు. అతని భార్య మాలిని. వారిద్దరూ అతిథుల్నీ అభ్యాగతుల్నీ ఆదరిస్తూ గృహస్థ ధర్మాన్ని పాటిస్తూండేవారు. వారికి శ్రీ వేంకటేశ్వరస్వామి ఇలవేలుపు. ఒకనాడు వారింటికి కాశీయాత్ర చేసి వచ్చిన ఒక బ్రాహ్మణోత్తముడు వచ్చాడు. ఆ దేవదత్త దంపతులు ఆయనను సాక్షాత్తు వేంకటేశ్వరస్వామిగా భావించి అతిథి మర్యాదలు చేశారు.

భోజనానంతరం ఆ బ్రాహ్మణుడు వారి జాతకాలు పరిశీలించి చూసి, జాతకం ప్రకారంగానూ, గోచార ప్రకారంగానూ దేవదత్తునికి శనిదోషం వల్ల అపమృత్యువు కలిగే సూచనలు కనబడుతున్నాయనీ, ఆ అపమృత్యు దోష పరిహారం కోసం సప్త (7) శనివారవ్రతం చేసి అటు శనైశ్చరుణ్ణీ, ఇటు శ్రీ వేంకటేశ్వరస్వామినీ భక్తి శ్రద్ధలతో ఆరాధించవలసిందనీ "అమ్మా! నీవు శ్రద్ధ వహించి నీ భర్తను కూడా సప్తశనివారవ్రతం చెయ్యడానికి ప్రోత్సహించి నీ



సౌభాగ్యాన్ని నిలుపుకోవాలి సుమా!" అని హెచ్చరించాడు. సప్తశనివార వ్రతవిధానాన్ని కూడా వివరంగా బోధించి సెలవు తీసుకుని తన దారిని తాను వెళ్ళాడు.

దేవదత్తుడికి తారాబలం చంద్రబలం సరిపోయిన ఒక శుభదినాన, ఆ దంపతులిద్దరూ బ్రాహ్మముహూర్తాన (తెల్లవారుజామున 4 గంటలకు) లేచి స్నాన ధ్యానాదులు నిర్వర్తించి, ఇంటిలో ఈశాన్య భాగాన పూజాపీఠం పెట్టి, మండపం వేసి, వేంకటేశ్వరస్వామి చిత్రపటం పెట్టి పూజా సామగ్రులు, నైవేద్య పదార్థాలూ ఉదయం అంటే కొబ్బరి కాయలూ, అరటిపళ్ళూ, నల్లద్రాక్షపళ్ళూ, 7 చిమ్మిలి ఉండలూ సిద్ధం చేసుకుని ఉదయం పూజచేసి, ఆనాడు సాయంకాలందాకా ఉపవాసం చేసి సాయంకాలం పళ్ళూ కాయలతో పాటు 7 లడ్డూలు గూడా నైవేద్యానికి సిద్ధం చేసుకుని సాయంకాల పూజ చేసుకొని, ఒక బ్రాహ్మణుని పిలిచి అయనకు భోజనం పెట్టి ఆపైన వారు భుజించి మొదటిరోజు వ్రతం యధావిదిగా నిర్వర్తించారు. ఆ విధంగా వరుసగా వారు ఏడు శనివారాల పాటు వ్రతాన్ని భక్తి శ్రద్ధలతో కొనసాగించారు.

ఏడవ శనివారం వ్రతపరిసమాప్తి చేసి భోజనం చేసి కొంతసేపు శ్రీ వేంకటేశ్వరస్వామి మహిమలు వర్ణించుకుంటూ కాలక్షేపం చేసి ఏ నడిజాములోనో కొంచెం నిద్రించారు. ఆ దంపతుల భక్తిశ్రద్ధలకు, పూజా విశేషాలకూ ప్రసన్నుడై శ్రీ వేంకటేశ్వరస్వామి మాలినీ దేవికి స్వప్నంలో సాక్షాత్కరించి, "ఓ పరమసాధ్వీ! మీ దంపతులిద్దరూ శ్రద్ధాభక్తులతో చేసిన సప్తశనివార వ్రతానికి నాకు చాలా సంతుష్టి కలిగింది. ఆ వ్రత ప్రభావం వల్ల నీ భర్తకు శనైశ్చరదోషం, అపమృత్యు భయం కూడా తొలగిపోయింది. అతనికి రాబోయే జన్మలోని ఆయుర్దాయాన్ని ఈ జన్మలోనికి తీసుకువచ్చి ఇతన్ని పూర్ణాయుర్దాయం కలవాణ్ణి చేశాను. మీరిద్దరూ సుఖశాంతులతో ఆనందంగా నూరు సంవత్సరాలు జీవించి ధర్మార్థ కామమోక్షాలనే నాలుగు పురుషార్థాలూ సాధించుకుంటూ మీ మానవ జన్మను సార్థకం చేసుకోండి" అని దీవించి అదృశ్యుడైనాడు. వెంటనే ఆమె లేచి భర్తను లేపి తన స్వప్న వృత్తాంతాన్ని వినిపించింది. ఆయనకూడా సంతోషించి భార్యను అభినందించాడు.

ఒక శుభముహూర్తాన ఆ దంపతులిద్దరూ శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనార్థమై తిరుపతి కొండకు వెళ్ళి మొక్కులు తీర్చుకొని ఆ స్వామిని మనసారా స్తుతించి, ప్రసాదం స్వీకరించి తిరిగి వచ్చారు. ఇంటికి వచ్చాక బ్రాహ్మణులను పిలిచి అన్నసంతర్పణ చేసి బ్రాహ్మణాశీర్వాదాలు పొందారు. జీవితాంతం వరకూ యధాశక్తిగా శ్రీ వేంకటేశ్వరస్వామి సేవ చేస్తూ చివరికి శ్రీ స్వామి సాన్నిధ్యాన్ని పొందారు. "కలౌ శ్రీ వేంకట నాయకః" అని పెద్దల సూక్తి. కలియుగంలో శ్రీ వేంకటేశ్వరస్వామిని మించిన ఆరాధ్యదైవం లేడు. ఈ సప్త శనివార వ్రతంతో ఆయన నారాధించిన వారికి శనిదోషాలు తొలగి శ్రీ స్వామి అనుగ్రహం లభిస్తుందని సూతుడు శౌనకాది మహామునులకు వినిపించాడు. వారు విని ఆనందించారు.

కలియుగమున శ్రీ వేంకటేశ్వరస్వామియే ప్రత్యక్షదైవము. భక్తి శ్రద్ధలతో శ్రీ స్వామివారిని అర్చించిన వారికి యిహపరలోకముల యందు భోగ భాగ్యములు కలుగును. శ్రీస్వామివారికి మిక్కిలి యిష్టమైన యీ శనివార వ్రతమును చేసినవారికి ఉన్న కష్టములు తీరును. గ్రహబాధలు పోవును. సంపదలు భోగములు కలుగును. వారికి వారి కుటుంబమునకు సర్వశుభములు కలుగును. శనివారవ్రతము నాచరించినవారికి అసాధ్యమే లేదు. ఈ కలియుగమున శనివారవ్రతము మానవులకు కల్పవృక్షము వంటిది. శనివారవ్రతమును చేసి స్వామివారిని అర్చించి స్తుతించి, యీ కథను చదువుకొనినవారు ధన్యులు. శ్రీ వేంకటేశ్వరస్వామి సర్వదేవతా స్వరూపుడు. ఆయనను అర్చించినచో అందరు దేవతలను అర్చించినట్లే అగును. ఆయన సంతోషించినచో దేవతలందరును సంతోషించినట్లే. పూజలో వస్తుసామగ్రి మన సంపద ఆడంబరము వీనికన్నను మనలోని భక్తిశ్రద్ధలే ముఖ్యములు.

కావున మనము అందరమును యధాశక్తిగ శనివారవ్రతమును ఆచరించి శ్రీవేంకటేశ్వరస్వామి వారి యనుగ్రహము నందుట మన కర్తవ్యము-బాధ్యత.

ఓం నమో భగవతే వేంకటేశాయ



# శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం



కౌసల్యా సుప్రజా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥1
ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ
ఉత్తిష్ఠ కమలాకాన్త త్రైలోక్యం మంగళం కురు॥ 2

మాతస్సమస్త జగతాం మధుకైట భారేః
వక్షో విహారిణి మనోహర దివ్యమూర్తే।
శ్రీస్వామిని శ్రితజన ప్రియ దానశీలే
శ్రీ వేంకటేశ దయితే తవసుప్రభాతమ్ ॥ 3

తవ సుప్రభాత మరవిందలోచనే
భవతు ప్రసన్న ముఖ చంద్రమండలే
విధి శంకరేంద్ర వనితాభిరర్చితే
వృషశైలనాథ దయితే దయానిధే ॥ 4

అత్ర్యాదిసప్త ఋషయ స్సముపాస్య సంధ్యాం
ఆకాశ సింధు కమలాని మనోహరాణి ।
ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రపన్నాః
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ ॥5

పంచాననాబ్జభవ షణ్ముఖ వాసవాద్యాః
త్రైవిక్రమాది చరితం విబుధాః స్తువంతి
భాషాపతిః పఠతి వాసరశుద్ధి మారాత్
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ ॥ 6



ఈషత్ప్రఫుల్ల సరసీరుహ నారికేళ
పూగద్రుమాది సుమనోహర పాలికానాం
ఆయాతి మందమనిల స్సహ దివ్యగంధైః
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ ॥ 7



ఉన్మీల్య నేత్రయుగ ముత్తమ పంజరస్థాః
పాత్రావశిష్ట కదళీఫల పాయసాని
భుక్త్వా సలీల మథ కేళిశుకాః పఠంతి
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ ॥ 8



తంత్రీ ప్రకర్ష మధురస్వనయా విపంచ్యా
గాయత్యనంతచరితం తవ నారదోఽపి
భాషా సమగ్ర మసకృత్కర చారురమ్యం
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ ॥ 9



భృంగావళీ చ మకరంద రసాను విద్ధ
ఝంకారగీత నినదైః సహసేవనాయ
నిర్యాత్యుపాంత సరసీ కమలోదరేభ్యః
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ ॥ 10